చున్నాఁడు; అంతలోఁ 'గాఁదని భ్రాంతిఁ దోఁచుఁచున్నాఁడు.
అంత సూర్యనారాయణకును సాధుజీకిని ఇట్లు ప్రసంగము
సాగెను :—

"తమ దేదేశంసాధూగారు ?"

"అన్ని దేశాలు మనవే. ఏదేశ మని చెప్ప మన్నారు.
విశ్వమే మనది."

"ఆహాఁ- అదికాదు- తమ రేదేశంనుంచి దయచేస్తు
న్నారని అడిగాను. తప్పైతే క్షమించండి."

"తప్పేమున్నది లెండి. తప్పులూ ఒప్పులూ మనం
కల్పించుకొన్నవే- అంతా ఒప్పే; తప్పనేదే లేదు. మీకు
తప్పైనది నాకు ఒప్పు- నాకు తప్పయినది మీకు ఒప్పు-
ఇందులో తప్పొప్పుల తగాదా తీర్చేవా రెవరు బాబా ? ఏ
మంటారు ? ప్రస్తుతం బెంగాల్నుంచి రాక. తర్లుపాడులో
భిక్షచేసుకొని రావడమైంది."

"అందుకనే అలసిన ట్టగపడుతున్నారు."

"ఉపాధికేలేండి ఈబాధ లన్నీ. దీ న్నాశ్రయించు
కొని వుండేటంతవఱకూ మనస్సుకూ బాధలు తప్పవు. మన
స్సూ శరీరమూ ఆధారాధేయములు. అదే అన్యోన్యాశ్రయ
ణము- ప్రాణవాయువులు సంచారం చేస్తూవుండేదాఁకానే
మనోవ్యాపారం. అది జరుగుతూవున్నంతవఱకే భౌతికశరీరానికి

సుఖ-దుఃఖాలు- ప్రకృతికి వికృతి స్వభావం. ఆ వికృతిని దాటితే అంతా ఆనందమే. సరే- దీనికేంలేండి। తవ్వేకొద్దీ లోతు- అంతా పుంతా ? ”

“ చిన్నవయస్సులోనే ఇంత విరక్తి కలిగిందే మీకు! పూర్వజన్మపుణ్యమ్ !”

“ బాబా, కోపంరాదుగదా ఒక్కమాట ఆలకించండి. లోకానికి ఆలోచన తక్కువ- అనుకరణ మెక్కువ- ఎక్కువేమి తక్కువేమి ? ఉండే దంతా అనుకరణమే. రక్తీ విరక్తీ పరస్పరం కల్పితాలు- రక్తి వికారమే విరక్తి, విరక్తి ఆభాస చెందితే రక్తి ఔతుంది. ‘ ఏకోరసః కరుణయేవ నిమిత్తభేదాద్భిన్నః పృథక్ పృథ గివాశ్రియతే వివర్తాన్’ అన్నాడు భవభూతి. కాఁబట్టి అసలు రక్తే ప్రధానవస్తువు. దాని అభావాన్నే విరక్తి అనుకుంటూవున్నామ్. ఒకదానియందు విరక్తి కలిగిందంటే ఏమన్నమాట?- మరొకదానిమీఁద రక్తి కలిగిందన్నమాట- ఏమంటారు ? రక్తే స్వతస్సిద్ధమైంది. విరక్తి తెచ్చుకున్నది. ఇఁక ‘ పూర్వజన్మపుణ్యా ’ మన్నారుగదా ? పూర్వజన్మ మనేది అనుషంగికంగా వచ్చిన మామూలుమాటేకాని సిద్ధాంతంకాదు- ఏమంటారు ? అది సిద్ధాంతమే అయితే ఇన్ని మతభేదాలకు కారణ ముండగూడదు- ఏమంటారు ? ఏందో లెండి ! ఈ వెఱ్ఱివేదాంతానికేమి? ”

సాధూజీహేతువాదమునకును సందర్భశుద్ధికిని సూర్య నారాయణ తనలోఁ దాను మెచ్చుకున్నాఁడు. తనకుఁగల సందేహములు తీర్చుకొనఁ దలచినాఁడు. వారిద్దఱకు మరల నిట్లు సంభాషణము జరిగెను :

"సాధూజీ, తా మే పీఠానికి చెందినవారో?"

సాధు చిఱునవ్వున- బాబా, మన వాదం మీకు విపరీతంగా తోస్తుంది. పోనీ ఏదో అడిగినారు. కాలక్షేపంకూడ అవసరమైంది. అన్నిపీఠాలూ ఆశ్రయించడమయింది. అన్ని మతాలు పెద్దలవల్ల వినడమూ అయింది. ఆత్మకు హితమైన దొక్కటీ కనపడలేదు. 'సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మతఃకరణ ప్రవృత్తయః' అన్న కాళిదాసు వాక్యం సమస్త మతముల సారం అంటే- సర్వమునకూ అంతఃకరణమే ప్రమాణమ్ బుద్ధిమంతులకు."

"అలాయితే మన ఇష్ట మొచ్చింది చే యొచ్చన్న మాట."

"ఆహా - ఇష్టము వచ్చింది చేయడమూ, కష్టంగా తోచింది మానివేయడమూ."

"ఇష్టమైతే తప్పుకార్యాలు చేయవచ్చా?"

"మళ్ళీ మొదటికి వచ్చినారు. అది తప్పో ఒప్పో ఎవరు నిర్ణయిస్తారు? ఏకార్యానికి తలపెడితే గుండెదడ కలుగుతుందో దాన్ని తప్పనిన్నీ ఏకార్యానికి పూనుకుంటే గుండె ఉత్సా

దేన్ని పురికొల్పుతుందో దాన్ని ఒప్పనిన్ని గ్రహిస్తే సరి-అదే అన్ని మతముల నిగ్గున్ను." తన చేసిన పని ఒకరికి చెప్పడానికి జడిస్తే అపనితప్పు. చేసిందాన్ని చెప్పగలిగితే ఒప్పు. తప్పొప్పులకు తేడా ఇదే చూడండి. దీన్ని నిర్ణయించి హెచ్చరిస్తూ వుంటుంది అంతఃకరణమ్ - ఏమంటారు? శాస్త్రకారులు మొదలుగా: 'మనయేవ మనుష్యాణామ్ కారణమ్ బంధమోక్షయోః' అన్నారు. బంధానికిన్ని మోక్షానికిన్ని మనస్సే కారణ మన్నారు. అంటే: అంతఃకరణమే నన్న మాట-ఏమంటారు?

అనిన సాధూక్తసమాధానమునకు సూర్యనారాయణ అంగీకారసూచకముగా నిలువున తల ఆడించుచు, జేబులో నుండి నిప్పుపెట్టెతీసి పుల్ల వెలిగించి చేతి గడియారమును చూచుకొని—

"అబ్బా! ఎనిమి టైం దాటిపోయ్... ఇక ఈ పూట ఉపవాసమే లెండి."

"ట్రెయినుకు పోవలసివుంటె టయిం అయింది."

ట్రెయినికి కాదండి. మావాళ్ళు శ్రీశైలం వెళ్ళారు. వెంట మగాళ్ళెవరూ లేరు. నేను వెళ్ళవలసింది. వస్తా నని నమ్మించి వాళ్ళని పంపాను. నాకు వెళ్ళటం పడ్డదికాదు. ఈ వచ్చే తిరుగుబళ్ళల్లో మావాళ్లొస్తా రేమో నని కాచు కూర్చున్నాను."

"అయితే సరే. అంతా దైవాధీన మని నిర్విచారంగా వుండడమే జన్మానికి పరాకష్ట. అయినదానికి చింతించీ లాభం లేదు. కాబోయ్యే దాన్ని గూర్చి అలజడి పడ నవసరమూ లేదు. అది పామరత్వ మనిపించు కుంటుంది- ఏ మంటారు? కాలాతీతులపాట మన కెలుక లేదు. ఇక మనబోటి కాల బద్ధులను కాలమే నడిపిస్తుంది-ఏమంటారు?"

"చిత్తం. అంతేనండి చివరముక్క. నా కేదైనా మత సమ్మోధమైన పుస్తకాలు చెబుతారా ?- చదువాలె నుంది. వివేకానందస్వామి బోధనలు కొన్ని చదివాను. రామతీర్థ గ్రంథం గూడా ఒకటి చదివినట్లు జ్ఞాపకం కాని తమ వంటి తెలిసినవారి సేవ కొన్నాళ్ళు చేస్తేనేకాని అవి బోధపడవు."

"బాబా, కోపగించకండి-మనవిచేస్తాను. కళ్ళుమూసు కొని చూడడానికీ, చెవులు మూసుకొని వినడానికీ యత్నిస్తూ వుంటుంది లోకం - ఇది స్వభావమే అనండి. తన రొండిలో వున్న వస్తువును మరిచి నిన్నూ నిన్నూ అడిగితే ఎవ రేమి చెబుతారు ? మతం మతం అని అర్థంలేని పెట్టిలో పడు తుంటారు. వేదాంతవిచార మంటూ డబాయిస్తూ వుంటారు. తన్ను మరచి జగత్తునంతా మరమ్మతు చేతా మనేదాన్ని మత మంటున్నారు. తన చూడని— చూడ లేని— దాన్ని గురించి పారిభాషికశబ్దాడంబరంతో ప్రసంగించే దాన్ని వేదాంత మనుకుంటున్నారు. ఇదంతా మోస మంటే

నమ్మండి. అంతే పెద్దలు చెప్పిన మార్గాలను ఆక్షేపిస్తూవున్నాననుకోకండి. వారు సవ్యంగానే బోధించినారు. నిన్ను నీవు తెలుసుకోమన్నారు. ధర్మంచేయమన్నారు. 'తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వమ్మున జరుగువాడు—' ఇందులో తప్పెక్కడ మున్నది. ధర్మము చేయడమున్నది. ఇంతకంటె మతమూ ఇంతకంటే వేదాంతమూ ఏమున్నే మున్నది? ఏమంటారు?"

సూర్యనారాయణ మరల అగ్గిపుల్ల వెలుఁగున చేగడియారము చూచుకొని సిగరెట్టంటించినాఁడు.

"బాబా, టయిమ్ ఎంతైంది?"

"ఎనిమ్మిది కావస్తుంది." మీరెందాక?"

"ప్రస్తుతం గుంతకల్లు; అక్కణ్ణించి కాల మెక్కడికీడిస్తే అక్కడికి.

"మీరు వెళ్ళేబండి రాత్రి రెండుగంటలకు వస్తుం దనుకుంటాను."

"ఆఁ—"

అని, సాధూజీ గోడవైపున సంచిని తలగడగా నుంచుకొని పరున్నాఁడు. ఎడ్లమెడగంటల చప్పుడు వినఁ బడినది. క్రిమముగా ఆ చప్పుడు దగ్గఱ దగ్గఱకు రాఁ దొడఁగినది. సూర్యనారాయణ అరుగు దిగి, కొన్ని యడుగులు ముందునకు నడచి ధ్వనివచ్చు దిక్కు ముఖమై నిలిచినాఁడు. చిమ్మ

చీకటి- బండ్లవాండ్ర అదలింపులు వినఁబడుచున్నవి. ఇంకెంత దూరమున వచ్చుచున్నవో రా నిమ్మని మరల తిన్నెమీఁద తన స్తంభాన్ని కానుకొని కూర్చుండుచు—

"ధ్వని వినఁబడుతుందికాని, బండ్లు కనఁబడవు- ఎంత దూరాన వున్నవో! అంగుల్లో కన్ను పొడుచుకున్నా కనపడని అంధకారమూ... నాగూజీ వరున్నారా?"

"బాబా, కళేబరం పడింది. కన్ను మూఁతపేను. మీ రన్నమాటలు వినఁబడుతున్నవి. ధ్వని వినఁబడు తున్నదికాని బండ్లు కనఁబడ వన్నారు. ఎంత అర్థముంది బాబా!"

"ఏమిటండీ? సెల వియ్యండి."

'వింటారా?- నాద బిందుకళలే సృష్టి పరిణామానికి మూలస్థానాలు. నాదంలోనుంచే బిందువు. బిందువులోనుంచే కళ- అంటే అవ్యక్తంలోనుంచే ఈ సృష్టంతా వ్యక్తమైంది. ఆ చీఁకటి వదిల్తేకాని ఆ తత్వం కనఁబడదు. ఈ చీఁకటి తొలఁగితేకాని ఈ ప్రకృతి వస్తువు లగపడవు- ఏమంటారు? ఏదో పిచ్చిమాటలు."

"అబ్బో! పిచ్చిమాడలే! పిచ్చిని వదల గొట్టే మాటలు."

బండ్లచప్పుడు మఱింత దాపున వినవచ్చెను. సూర్య నారాయణ చప్పున వెళ్లి పూర్వస్థానమున నిలిచినాడు. కొన్ని

నిమిషములకు బండ్లవరుస సమీపించినది. అందుఁ గొన్ని రెయిలుగేటు దాటఁ బోయెను. మూఁడుబండ్లు మాత్రము సత్రము వద్దికి వచ్చి యాగెను. యువకుఁ డొకఁ డొకబండి నుండి దిగి,—

"దిగండమ్మా ఇదేసత్రం. జాగ్రత్తగా దిగండి."-అనెను.

"తాళవమ్మా నన్ను దిగనీ-మాయగోల- నే దిగి నిన్ను దించుతాను"-అని పూర్వసువాసిని యొకతె దిగి, తలమీఁది ముసుగు సవరించుకొని కొసచెంగు బిగించి రొండిలో దోపు కొనుచు-

"ఇహ దిగు"- అన్నది.

ముసలమ్మ లిద్దఱు దిగినారు.

"బాబూ, మంచితీర్థపునుయ్యి దాపే కాదూ?" అన్న దొక ముసలమ్మ.

"దా పేమిటీ!-కాస్తదూరమే వెళ్ళాలి." అన్నది."- మఱొక ముసలమ్మ.

"ఉండండి వెడదాం సామాను దింపించి కొవ్వొత్తి దీపం వెలిఁగిస్తాను. చీకటిగుయ్యారం!" అనుచు నాయువకుఁడు సామాను అరుగుమీఁద సరిదించి క్రొవ్వొత్తిదీపము వెలిఁగించినాఁడు. తనవారే యగుదురా అని సంశయమునఁ జూచుచు నిలుచున్నాఁడు సూర్యనారాయణ. కంఠధ్వని తమ

వారిదిగనే యున్నది. కృష్ణవేణి కనఁబడదు. ఈయువకుఁ డెవఁడు?-అని ఆలోచనలోనికి దిగినాఁడు. "అప్పుడే బయ ల్దేరావటమ్మా? స్నానమేమిటి ఈయర్ధరాత్రిల్లో మాయగోల. ఒళ్ళు తిప్పుతూవుం దనవూ? నీ విక్కడే ఆగు. నీళ్ళుపట్టు కొస్తాను-మంత్రస్నానం చేతూగాని." అన్నది మళ్ళీకమ్మ- సూర్యనారాయణ వెంటనే ముందునకు వచ్చి—

"మీనత్తయ్యేనా ?

"ఎవరువారూ?"- ముందునకు వాలి చూచినది.

"నేను కాదుటమ్మా సూర్యనారాయణ్ణి?"

"ఓరి నువ్వటోయ్! బాగా చేశావుబాబు!"

"సూరాయ్, అమన్నను అప్పగిం చొచ్చావ్ మల్లి కార్జునుడికి"—అనిగొల్లున పేరమ్మ ఏడ్చినది.

సూర్యనారాయణ దిగ్భ్రాంతుఁడైనాఁడు. ఎక్కడికి వెళ్ళిపట్టని తహతహపడినాఁడు. "ఆనక మాట్లాడుకుందామ్ లెండి" అని రంగరావు సముదాయించినాఁడు. కాని సూర్య నారాయణకు ఆవేగ మాగలేదు. పేరమ్మగారు తప్ప కడమ వారందఱు నూతికి వెళ్ళినారు. వెంట గంగరావు దీపముఁ గొని చనినాఁడు. ఒంటరిపాటున సూర్యనారాయణ పేరమ్మగారిని గ్రుచ్చిగ్రుచ్చి అడిగినాఁడు-జరిగినవృత్తాంతముఆమె చెప్పినది."

"నే ననుకున్నంతే ఐంది. ఆవేళ బెజవాడలో కన్ని ళ్ళెట్టుకున్నది. ఇ దేమిటో అపశకున మనుకున్నాను. నేను

మీతో వెళ్ళనద్దనేచెప్పాను- విన్నదికాదు. శ్రీశైలం చూడా లని ఉవ్విళ్ళూరింది. మీ రక్కడ ఏమి చిలిపిపని తల పెట్టారో జడిసి పోయుంటుంది. ఆనెంద్రుక లుంటే పుట్టి ముంచుకపోయిందా?"

"మే మే మన్నాంరా? ఆలావుంటే చూచినవా రేమం టారు? నలుగురు బంధువుల్లో అపఖ్యాతికాదూ? వచ్చింది.— ఆలాంటియోగం దానికి పట్టింది. ఇప్పు డనుకుంటే లాభ మేమిటి? ఎక్కడికెళ్ళిందో!"

"అదే నాకూ పాలుపోవటంలేదు. నట్టిపిరికిది. గండా గొండితనమూ తెలియదు." అనియాలోచన నభినయించి— "బహుశా విశాఖపట్నం వెళ్ళి ఉంటుం దనుకుంటాను; తప్పదు- అక్కడికే వెళ్ళిఉంటుంది."

"విశాఖపట్నం ఎందు కనివెడుతుంది?- ఎవ రున్నారని అక్కడ?"

"రంగనాయకమ్మ ఉండలే దటమ్మా?"

"ఆఁ-రంగనాయకమ్మా? ఎవరూ?"

"ఆఁ-నాన్నగారు అనకాపల్లెలో ప్లీడరీచేస్తున్న రోజుల్లో మనమేడ కెదురుగా డాబాయింట్లో తహసీల్దారు భీమశంక రంగా రనేవా రుండలా?-జ్ఞాపకాని కొచ్చిందా?"

చూచుకొని మార్తాండు నొక్కమారు పరికించినాఁడు. తిన్నఁగాబోయి బిక్కింగ్‌హామ్‌లాడ్జివద్ద ఆగినాఁడు. అతని పసిమినిమ్మపండువంటి శరీరచ్ఛాయలో కోమలతయున్నది. మలిచినట్లున్న అవయవస్ఫూర్తియందు పాటవమున్నది. దైనందిన క్షురకర్మానుష్ఠానమునఁ జెక్కులు మెఱుఁగెక్కినవేకాని గఱుగుబాఱలేదు. సులోచనాచ్ఛాదితములయ్యు విశాలలోచనములు విలాస భాసులము లయ్యేనే కాని వికారమనిపింపలేదు. చిలుక లాసింపని దోరపండు. దర్శనీయ మగుమూర్తి.

బెంగాల్ హాఫ్‌స్లిప్పర్లు మోఁత చాపుతాళము ననుకరింప టకటక లాడ్జిమేడమీఁదికి వెళ్లినాఁడు. తన గదితాళము తీసి లోపలి కేఁగి తలుపు మూసినాఁడు. షర్టు విడిచి కొక్కెమునకుఁ దగిల్చినాఁడు. గోడఅద్దములో ముఖము జూచుకున్నాఁడు. మొగముఁగ్రమ్మినచెమటను తువాలుతో నద్దికొని సులోచనములనుతీసితుడిచి యలంకరించుకొన్నాఁడు. క్యాంపుకాటుమీఁద- పక్కచుట్ట కానుకొని పరున్నాఁడు. ప్రక్కన బల్లమీఁదనున్న 'న్యూఇండియా' పత్రికఁదీసి పిచ్చి కడమ భాగములను స్థాలీపులాకన్యాయమునఁ బరికించినాఁడు. అంతట 'లా'పుస్తకముం గొని గుఱుతుపెట్టినభాగము తెఱచినాఁడు కుడిచేయి పుస్తకమును బట్టినది. ఎడమచేతి వ్రేళులు మొలక మీసములను పుణుకుచున్నవి. పుటయైనఁ బూర్తిగఁ బాఱ జూచెనో లేదో విసుపుతో దానిని మూసి క్రిందవైచినాఁడు.

ఎడమచిటికెనవ్రేలిరవయుంగరమును కుడిచేతివ్రేళ్లతో ముందు వెనుకలకు జరుపుచు, కిటికీలోనుండి బయలును చూచుచుఁ బరధ్యానమునఁ గొంతవడి గడిపినాఁడు. చివాలున లేచి కోటు జేబులోని భగవద్గీత తెచ్చుకొని యథాపూర్వముగ పక్క-చుట్టకుఁ జేరగిలఁబడి గ్రంథము దెఱచినాఁడు. పుటలఁబొరలించినాఁడు. కర్మయోగము వచ్చినది—

"తస్మాదసక్త స్సతతమ్ కార్యమ్ కర్మసమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః."—

అజ్ఞాని యగువాఁడు కర్మముచేయవలయును. కావున నీవు ఫలము నపేక్షింపక విహిత మగుకర్మము ఎల్లప్పుడును చేయుచుండుము. ఫలము నపేక్షింపక కర్మము జేయుపురుషుఁడు సత్త్వశుద్ధినొంది క్రమముగా మోక్షసిద్ధి కర్హుఁడగును" అని చదువ నారంభించినాఁడు—

"ఏమండి సార్ రామచంద్రరావుగారూ" అని తలుపు దట్టుచుఁ బిలిచినాఁడు వెలుపలినుండి యొకఁడు. రామచంద్రరావు దిగ్గనలేచి తలుపు తెఱచినాఁడు— పోస్టుమాను రెండు జాబుల నందించి వెళ్లినాఁడు. రెండును కవర్లు. అందొకదానిని విచ్చినాఁడు— అగ్రభాగమునఁజూచి 'బెజవాడ' అని ఆ ఇంగ్లీషు జాబును చదివికొన్నాఁడు— కన్నులు తెలివికిఁ దప్పినవి. ముఖమును ఖిన్నత గప్పినది. చూపులు బయలునకుఁ బాఱచినవి. రెండవజాబు విచ్చి చూపులను మఱల్చిచూచినాఁడు 'విశాఖపట్నము నుంచా?' అనుకొని ఈ తెలుఁగు జాబున నైదారు పంక్తులు చదువునప్పటికి లోచనములుసహజచతురత సమాజ్ఞం

చినవి. ముఖమును గ్రసించిన ఖిన్నత పరాభూతమైనది. జాబు సాంతముగఁ జదివినాఁడు. బెజవాడ జాబు మరల నొకమాఱు ఓపికగఁ బాఱజూచినాఁడు. ఎడమచేతి వ్రేళ్లు మరల మీసముల నాశ్రయించినవి. ఇంచుక ఊర్ధ్వగతిఁ జెందినచూపు కిటికీపైనున్న రామకృష్ణ పరమహంసపటముమీఁదఁ బడినది. కొంచెము సేపు తదేకధ్యానమునఁ గడచినది—

"వసంతే వాసంతీ కుసుమ సుకుమారై రవయవైః
భ్రమంతీమ్ కాంతారే బహువిహితకృష్ణానుసరణామ్
అమందమ్ కందర్పజ్వరజనిత చింతాకుల తయా
వలద్బాధామ్ రాధామ్ సరస మిద మూచేసహచరీ."—

అని గీతగోవిందములోని శ్లోకము మెల్లగఁ బాడుచు లేచి లెటర్ ప్యాడ్ తీసికొనియుంచముఁ జేరి కూర్చున్నాఁడు. అంతలో నేదియో అకస్మాత్తుగ తోఁచినది! వెంటనే లేచినాఁడు. చేతిగడియారముఁ జూచుకొన్నాఁడు. వెలుపలి వరండాలోనికి వెళ్లి ఉత్తరదిక్కునను్న విక్టోరియాహాస్టెలు వైపు జూచినాఁడు- కుసుమాలములతోఁ బడమటి దిక్కునకుఁ జూపు మఱల్చినాఁడు- అటనుండి నికిడకుఁ జేసి మ్రీవముఁ దూర్పు దెసకు మరలించినాఁడు- సముద్ర శాంతతను విశాలతను గాంచుచుఁ గొంతసేపు నిలిచినాఁడు- గదిఁ బ్రవేశించినాఁడు- బల్లమీఁద జెల్లా చెదరుగనున్న పుస్తకములను పొందికగాఁ బెట్టి కుర్చీ మీఁదఁ గూర్చుండి జాబు వ్రాయ నుద్యోగించినాఁడు— కలమునకై వెదకినాఁడు; జ్ఞప్తివచ్చినది. లేచి కోటుజేబునుండి

తీసి, దీన్నిగా చేసినతాను దానిని మూసి ఎక్కడ పెట్టెనో తిరిగితినే యని తన విస్మృతిం డిలాచి ఎగతాళిసగవ్వుడు వల యూహించుకొన్నాడు. కుడిచేయి కలము బట్టినది. ఎడమ మో చేయి బల్లపై మోపసది. సత్కవినాయకులు కొంతసేపు చిరు నవ్వులతో జాలాడి, సుశోభనములు సవరించి, మీసములతోఁ బెలిమి నెఱపు చున్నవి. "సౌందర్యరేఖ" అని వ్రాసినాడు. తరు వాత వ్యాఖ్యానమయు దాని నాలోచించినాడు — "ఆశ్వాదన ములు" అని వ్రాసిన తెనాలి యాతని ముఖమున కొక చమత్కారమును చిక్కినాడు. తరువాత?—ఆలోచన. తోఁచినదానిని వ్రాయ నిష్టము కాదు. ఇష్టముగలవానికి ఊహింపరాదు. తనలోని యుత్సాహము నాఁటియు నొక్కమ్మడి నోటికిరావలయు నని అభిలాషము. ఛాందసమార్గ మగు నని జంకు. మరల నిం కొకమూఱు విశాఖపట్నముజాబువిచ్చి చదువుకొన్నాడు.—

"మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సంతర్పణాని, సకలేంద్రియమోహనాని,
ఏతాని తే సువచనాని, సరోరుహాక్షి
కర్ణామృతాని, మనసశ్చ రసాయనాని," *

* "మ్లానజీవితప్రసూన సంజీవులు,
తృప్తిదములు మోహితేంద్రియములు,
నీసుభాషములు, నీరజాతేక్షణ,
శ్రవణసుధలు హృదయసాయనములు"— ఉ. రా. చ.

అని శ్లోకమును పాడుకొనుచు వ్రాయ నుంకించి చే యాడించుచున్నాడు— అక్షరముపడదు—చివరకు—కొంతవడికి "జా బందినది—" అని వడిగనే వ్రాసినాడు. తరువాత?— మరల యోజన. మనస్సున నిశ్చయ మేర్పడినదికాఁబోలు!—

"రేపు బయలుదేఱుదును"—అని వ్రాసి చేతిగడియా రము చూచుకొన్నాడు— నాలుగింటికిఁ బది నిమిషములు కొఱంత- జాబు కవరులో నుంచి శిరోనామా వ్రాసినాడు— షర్టు తగిలించుకొన్నాడు- అలవాటు దొప్పునఁ గాళ్లు జోళ్లలో జొచ్చినవి. బయలుదేఱి ఫర్లాంగుదూరము పోయినాడు- తపా లుపెట్టెలో జాబుపడవేసి, హోటలునకు వెళ్లినాడు— ఏది యో చిఱుదిండియైనది. కాఫీ పుచ్చుకొనుచున్నాడు— గదికి తాళము వేయకయే వచ్చితి నని స్మృతివచ్చినదికాఁబోలు!— బెమ్మెరపోయిన చూపుతో తొందరగా కాఫీముగించి బయటి దుకాణములో వక్కాకుపుచ్చుకొని వేసికొనుచు దివ్వెన లాడ్జి చేరినాడు— తెఱచినతలుపులు తెఱచినట్లున్నవి. తన తెలుపు మఱుపులకు వింతపడినాడు—

సాయంకాలమునకును ఎట్లోకష్టముగఁ గడపినాడు— గడ్డముమీదఁ కత్తి త్రిప్పినాడు— కామినియాఅయల్ రాచి క్రాపుదువ్వినాడు— సోపుతో ముఖప్రక్షాళన మైనది. నీమా జామా అలంకారమైనది. సులోచనముల ధరించినాడు- అద్ద

## ౭. ప్రకరణము.

ములో నొక్కసారి ఆపాదమస్తకముగా

కొలిలు సరిదిద్దుకున్నాడు. మూలనున్న స్లిప్పర్లను తట్టి తొడిగినాడు- హాంగింగ్ కేన్ చేపట్టినాడు- మఱొకమారు అద్దమును దర్శించినాడు- దొరకొడుకువలె సిద్ధమైనాడు తలుపు తాళము వేసి తొపలుదిగినాడు. రోడ్డుమీదికివచ్చి పాకెట్టు తడవుకొన్నాడు. మేడమీదికి జని తలుపు తెఱచి నాడు- మంచముమీఁదఁ బక్కపెట్టెపై పెట్టి మఱచిన మని పర్సును వెంటనే జేబులో వేసికొని జాగ్రత్తగా తాళము వేసి టవునుకుఁ బయనమై వెడలినాడు.

---

## ౮. ప్రకరణము.

సముద్రపుగాలి విసరుచున్నది. సాయంకాలము మూఁడు గంటలు వంటలక్క అవధాన్లరామమ్మ పటవసారాలోనుండి తలమీఁది ముసుఁగు సవరించుకొనుచు సన్నగొంతుకతో—

"బంగారు లేడికై పాఱె రాఘవుఁడూ
అంగన కటపీడి యరిగె లక్ష్మణుఁడూ
సీతమ్మఁ గొనిపోయెఁ జెనటి రక్కసుఁడూ
అతఁడె ననుఁజూడు నన్ను రాముండూ"—

అని పాడుకొనుచు నడిమింటి దక్షిణపు గదివద్దికిఁ బోయి, గుమ్మము పట్టెలమీఁద రెండుచేతు లానించి ముందటికి మొగ్గి—

"రంగనాయకమ్మ తల్లిగారికి ఇంకా నాటకంబడలిక తీఱిందికాదు కామోసు: చల్లార్తే ఇడ్డెన్లు సైంచ నంటారు- కారప్పొడుం చేశాను- కాఫీ కాచాను"- అన్నది-

రంగనాయికమ్మ పక్కమీఁద నుసులుచు—

"అప్పుడే పొద్దయిం దటమ్మా!" అన్నది.

"మరేమిటి!- పంతులవారు ఫలహారానికి వచ్చే వేళ కూడా అవుతేను!"

"ఆవిళ్లే చిందా?"

"తెలవదు"-అని "అమ్మాయీ"- అని పిలిచినది వంటలక్క—

"వస్తున్నా" అన్నది అమ్మాయి.

అభ్యంజన మైనది కాఁబోలు!-వినీలకుంతలములు విరియఁబొఱె వెన్నునం దంతటను పసపఱచుకొన్నవి. కనుబొమలనడిమి కుంకుమబొట్టు చెక్కుచెదరలేదు. కంటికాటుక మాయలేదు. కట్టిన జరీకమ్మిచీర, తొడిగిన రోజాపట్టు జాకెట్టు నలఁగలేదు- ఇట్లు అమ్మాయి మెట్లుదిగుచున్నది. కనులు నులుముకొనుచు గదిగుమ్మమున నిలువఁబడిన రంగనాయిక అమ్మాయినిఁ జూచి—

“ఏమిటోనే దేవలోకంనుంచి దిగుతున్నట్లుందే! రేపటికి………”-అని లేతనవ్వు నవ్వినది.

కనుల మొలిచిన మెలనవ్వు అరమోడ్పు రెప్పలలోఁదల దాఁచుకొన్నది- మొగమునఁ బొలకరించిన నునుసిగ్గు దొంతరలు అవనతశిరము నుఱుఁగు జొచ్చినవి. ఆ చిఱునగవుల మొలకలు, ఆ నునుసిగ్గుల మొలకలును, నెమ్మదిని పొంగినవలపు పాలమీఁగడతరగ లని కవియైనవాఁడు వర్ణింపక విడుచునా? చెలిమితులకించిన చిలుకతో విలుపిడిన ములికి వలె, ఫలముగాంచినచిలుకవలె అమ్మాయి నవ్వుచువచ్చి రంగనాయిక సందిటఁ జొచ్చెను. అట్లు ఇరువురు చెట్టవేసికొని దొడ్డి వసారాలోనికివెళ్ళి పూలమొక్కల కుండీలనడుమఁ గూర్చుండిరి. ఉపాహారమైనది- మధ్యహాలులోనికి నడచుచు,

“ఏదే కృష్ణా, నిన్న వాయించిన ‘నినువినా నామదెందు’ మఱొక్కమాటు వాయింపుమా! కనులకు సొగసెంతో అన్నచోట ఏమిటో కొత్తసంగతు లేశావు!-ఒరేకుఱ్ఱాడా మేడమీఁదినుంచి వీణ జాగ్రత్తగా పట్టుకొస్తావ్? పావంచాల మీఁద వేశావుసుమీ నీ పుణ్యమ్!”- అన్నది రంగనాయిక- కుఱ్ఱవాఁడు మేడమీఁదికిఁ బరువెత్తినాఁడు- కృష్ణ తలవంచుకొని చేతిగాజులు చూచుకొనుచు,—

“అలానే వాయిస్తానుగాని నువ్వుమాత్రం ‘శ్రీరఘువర’ కృతి వాయించకే!- వచ్చిందిమొదలు బతిమాలు

కుంటున్నానుగదా! ఎవళ్లైనా నేర్చుకుపోతా రని కుళ్ళు. పోతుంటనా!"—

"ఏమిటే నాకా కుళ్లుబోతుతనమ్! నీవే అంటున్నావా? ఇం కెవ్వరైనా అంటారా? మా యింటాబంటాలేని మాటన్నా వేమిటే!"

"అబ్బా! ఒక కుళ్ళుబోతుతనమేనా? ఒకకుచోద్యమేనా? అన్న అన్నే, చెల్లెలు చెల్లెలే!"

"ఈ నడుమ వీణ ముట్టుకూవుంటే నువ్వు పెట్టిందే ఒట్టు. అలవాటు పూర్తిగా పోయ్యింది- అంచేత వాయించటానికి బిడియమేస్తూంది-"

" పర్వాలేదులే! ఇక్కడ నీకు బహుమానా లిచ్చేవారెవరూ లేరు- నాకూ అలవాటు పోయిం దమ్మా! ఏదో వచ్చినట్లు వాయిస్తాలే- క్షమించు"--

కుట్టువాడు వీణ తెచ్చి పెట్టినాడు. దక్షిణపుగదిలో కృష్ణా-రంగనాయికలు తివాచీమీఁద గూర్చుచున్నారు. కృష్ణ శ్రుతిమేళవించి: 'నినువినా' కృతివాయింపఁ దొడఁగినది--

" ఆ దేమిటే సుతారమ్! మూఁగదానికి మల్లే! పాడుతూ వాయించరాదూ?"- అన్నది రంగనాయిక- సిగ్గు పెనఁగొన్న చిఱునగవు బలవంతముగ నాపికొని పాడుచు వాయింపఁగడఁగినది కృష్ణ- 'భానువంశతిలక నీదు భక్తుఁ

డనుచు 'పేరుగనుకా' అని అను పల్లవి ఆఖావసాంగతి వాయించుచున్నది. రంగనాయిక ఒడలు వెలియుని యుల్లాసముతో శిరఃకంపనము సేయుచు-

"సితాకీర మేమీ తగ్గలేదు సుమీ!"-అన్నది.

"రంగనాయికమ్మగారు—— అడ్రెసుకి రామారావు పంతులుగారు"- అని శిర్నామా చదివి పోస్టుమాను జాబును గిరవాటు వేసినాఁడు. కృష్ణవేణి సితాగాన మాపినది. రంగనాయికి పరుపుననెక్కి జాబుగొని తక్షణం కనరుచించి జాబు దీసితనలోఁ జదువుకొనుచు వచ్చినది. కృష్ణ తనకుఁ జూపుమన్నది. రంగనాయిక చిరకము చూపినది. చూపకున్నఁ దన మీఁద ఒట్టుపెట్టుకొన్నది కృష్ణ. తరువాత కొంత ఇగ్గుమొగ్గు లాడినారు. తుదకు కృష్ణ జాబు నొడిసి లాగినది. చదువుకొని-

"ఇందుకేకదా! ఈమాత్రానికే ఇంతమూరాముటే!" అన్నది

ఇంతలోఁ బదుగురు పార్టీలతో మాటలాడుచు గృహమేధి రామరావు కోర్టునుండివచ్చి కచేరీసావడిఁ బ్రవేశించి, కోటును తలగుడ్డను తీసినాఁడు. సేవకుఁడు కుఱ్ఱవాఁడు వెంటనే వాని నందుకొనిపోయి గదిలోఁ దగిల్చినాఁడు. రామరావు పడక కుర్చీమీఁద బరుండి--తలగోకికొనుచు-

"మాచారూ, సింహాచలంగారూ, మన మూఁడో సాక్షి—ఆయనపే రేమిటీ?—ఆ... రా జండీ!..."

"బంగార్రాజు గారా అండీ?"—

"ఆఁ—బంగార్రాజు- ఈవాళ మతాబా కాల్చేశే వాఁడే కాస్త నేను పరాగ్గా ఉండిఉంటేను. చప్పున హెచ్చరించానేమో సర్దుకున్నాఁడు. అంతమట్టుకూ తెలివైనబుఱ్ఱే. జడ్జీగారప్పుడే నాకేసిచూచారు. టకీని ఒకముక్క— వేశేశాను— అతికింది. లేకుంటే ఏ మయ్యేది?—కేసంతా అడ్డంతిరిగేది; చేసిన పసంతా పలాయనము లయ్యేది-ఒప్పుకుంటారా?" తలగోక్కొనుచు- "సమయంలో వెనకా ముందూ తడువుకుంటూ ఏక్క-మొగ మేశామా-వ్యవహారం చెడ్డ దన్నమాట-ఒప్పుకుంటారా?"

"మకేనుండి"

"మాంశాంహా, ప్రతివాదిచేత అవకతవకలు పేలించాను. మాండుగుల యెస్టేటుకీ, కళింకోటవారికీ తనకూ లావాదేవీలున్నాయని యేమి టేమిటేవో చెప్పబోయ్యాఁడు- చివరకి ఏమీసమ్మంధంలే దని వాగించానా? వాడి స్టేటుమెంటుకీ వాఙ్మూలానికీ తేడా చూపించాను. వాడిప్లీడరు కాస్తగడుసు వాఁడే. ఈ ప్రశ్న అడగ్గూడ దని ఆక్షేపించాఁడు. కాని ఎవిడెన్సు ఆక్టులో ఏదోచూపి మసిబూసి నేరేడుగాయ చేశేశాను. తెలివితక్కువ పెద్దమ్మ ఆ ప్లీడరు కనుక్కున్నాఁడుగాఁడు. తెల్లమొగ మేశాఁడు. జడ్జీగారికూడా కాటు కేశేశాను. అవతలివారి తెలివి తక్కువవల్లను ఇవతలివారు గెలుస్తుంటారు-ఒప్పుకుంటారా? కోర్టువ్యవహారా లంటే వట్టి జూదాలు-ఈలాంటి వ్యవహారాల్లో ప్లీడరన్నవాఁడు కాస్తంత

మెలకువగా వర్తించాలి. మన జడ్జీలాంటి వాళ్ళదగ్గర తెలివి తేట లంతగా పనికిరావు. ఆయన చెప్పేదానికి బుఱ్ఱవూపుస్తూ మందహాసం చేస్తూండాలి. జడ్జి అయినా చెడ్డవాడని చెప్పను. లా అంటే ఏలోకంలో వుందో ఆయనగారికి తెలవదు. ఆర్గ్యుమెంటు చెబుతుంటే ఆఫీసు కాకితాలమీంద సంతకాలు పెడుతుంటాడు. ఒక్కతోచక కేకలేస్తాడన్నమాటేకాని మొత్తానికి మంచివాళ్ళలో చెప్పుకోతగ్గవాండే!- ఒప్పుకుంటారా? ఏదో బారిస్టరీ ప్యాసయ్యాడు- తండ్రిగారి ప్రాపకం అక్కరకొచ్చింది- ఇంతకూ అదృష్టం పట్టింది. మునసబైన మూండేళ్లకంతా సబుజడ్జి అయ్యాడు. ఇప్పుడు అక్టింగుజడ్జీ" ఐ కూచున్నాడు—ఇదో అదో అనేటప్పటికి ఖాయ మౌతుంది. నమ్మండి ఈ కోర్టుల్లో, ఈ లాయర్లూ, ఈ జడ్జీలు—అంతా తగాయిదాలు పెంచడానికే కాని తెంచటానికి కాదు. "—

అనుచు రామరావు శ్రమ నభినయించుచు గోడగడియారమును జూచెను. ఐదు గంటలు కావచ్చెను.

"సరే మీరు వెళ్ళండి! వచ్చేనెల్లోగదా ఆర్గ్యుమెంట్లు; మీరు రెండురోజులు ముందుగానే రాండి. అలహాబాదు, మద్రాసు హైకోర్టుల తీర్పులు మనకు ఆధారా లున్నాయి లెండి. కలకత్తా హైకోర్టు తీర్పొకటి మనకు కాస్తంత ప్రతికూలంగా ఉన్నట్టు కనిపిస్తుంది. కానీండి చూదాం! ఫీజు పూర్తిగా పట్టుకురండి! వాయిదాలు వేస్తే కాదు? హియ

రంగనాటికి ఖూజాగా యిచ్చేస్తా మన్నారు! ఏమిటో ఖాతా దార్ల సంత నిక్కచ్చిగా అడగలేము. మఱవకండి! ఇంత మొగమాటం లేకుండా అడుగుతున్నా నని అను కోకండేం! స్నేహానికి స్నేహమే— వ్యవహారానికి వ్యవహారమే! రెంటికీ ముడిపెడితే వికటిస్తుంది—ఒప్పుకుంటారా? ఆం—అన్నట్లు అస్సల్ నెంబరు 676-అప్పీలు వేయరూ? అపీలు నాయిడా దగ్గర కొస్తాం దనుకుంటాను. మరిగాంటే 304 of 09 లో జప్తుకు పెట్టించారా? వాడి కేవన్నా చరాస్తి వున్నదీ?"

"లేకేమిటండీ చేతికొచ్చిన *సొమ్ములు దిట్టమైనవి నాలుగుజత లున్నాయి."

"ఐతే తకరర్ లేదు. సరే వెళ్ళండి."

అనంగానే ప్లీడరుగారికి వందనాలుచేసి క్లయంట్లు సెలవు పుచ్చుకున్నారు. రంగనాయిక నడిమింటి కిటికీలో నుండి—

"రారూ?" అన్నది. రామరావు తలగోక్కొనుచు లోనికి వెళ్ళినాడు. కాళ్ళు మొగము కడిగికొని ఉపాహారము చేయం గూర్చున్నాడు. రంగనాయిక ఒడిలోని జాబు రామ రావు వద్దికి విసరి, కాఫీ చల్లార్చుచున్నది. కృష్ణ ఉగ్రాణపు గదిలోం జేరినది. రామరావు ఎడమచేత జాబు విచ్చి చూచు కొని—

---

* పశువులు.

చారపరాయణుల్ని కొంచెం కట్టుకుంటూ రావాలి. ఆ దేమిటి కోప మావేశించి నట్టుంది! నా కేసి చూడూ!"

"కానీండి మీ ఉపన్యాస మంతాను. మగాళ్ళకోప మేమేనా చేస్తుందికాని ఆడాళ్ళకోప మనంగా ఎంత?-ఆడాళ్ళ నంగా ఎంత?" "నీ వర్థ్ర చేసుకోకుండా అవసరపడు తున్నావు. నా లాంటివాడు ఈ లాంటి వ్యవహారాల్లో కలుగ చేసుకుంటే లావు చిక్కు- లున్నాయి.ఒప్పుకుంటావా? ఏమిటి తల విసురు తున్నావు? నీధోరణి నీదేకాని కాస్తాత సంగతి-సందర్భాలు వినిపించుకోకపోతె ఎలాగ?"

"అంతా మనం నడుంగట్టుకొని చెయ్యవలసిందానికి ఎవరోపరాయిలు మాట్లాడినట్టు మాట్లాడితే ఏం చెప్పటం?"—

అనుచు రంగనాయికి కాఫీకప్పుచేతి కందిచ్చి లేవం బోయినది- రామరావు పుచ్చుకొనుచు, "కానీవో ఇంతలోనే సాధింపా? నీవన్నట్టు నడుంగట్టుకొని చెయ్యవలసిందే తకరర్లేదు. ఇం కొకరివిషయం చెప్పు; డాకాకొట్టి నిలవబడితాను. స్వవిషయంలో అంటే కాస్త జంకవలసి వస్తున్నది, ఎవ్వళ్యా ఇక్కడ మనతో కలిసేవా మన్నట్టు కనబడదు.ఒప్పుకుంటావా?"

"చెయ్యటానికి త్రికరణశుద్ధిగా పూనుకుంటే ఇన్ని నుతర్కాలకే అవకాశంలేదు. ఒకన్ని కోసమా?"

నీకు బోధపట్టంలేదు. యామన్నా అంటే నన్ను మింగేసేటంతకోప మొస్తు ది. నలుగురూ పోగై ఉత్సాహంగా

చేయవలసినకార్యమేనా? కలిశివచ్చేవారు ఊళ్లో లేరని నే నంటూ వుంటే—ఒప్పుకుంటారా?

"ఏమి టింతా విచిత్రంగా మాట్లాడుతున్నారు! రజస్వలావివాహాలు తప్పక జరగాలని, బాలవితంతువులకు పెళ్లిళ్ళు చేయకపోతే వాళ్ళకళ్ళనీళ్ళు మన సంఘాన్నీ దేశాన్నీ మాడ్చివేస్త వనీ—వ్యాసాలు వ్రాస్తుంటారు. మొన్న సంఘసంస్కరణసభకు మీ రగ్రసనాధిపత్యం వహించి ఇచ్చినఉపన్యాసాన్ని విన్నవా రందఱూ కళ్ళ కద్దుకున్నారు. ఇప్పుడు తీరా సమయానికి మొగం చాటెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు."

"ఆకథ వేరు; నీకు బోధపట్టంలేదు. లోకుల అభిరుచిని బట్టీన్నీ ఉద్దేశాన్నిబట్టీన్నీ మాట్లాడాలి. ఒప్పుకుంటావా? ఇంట్లో నాలుగ్గోడలనడమనుండే మీ కేం తెలుస్తుంది లోకభోగట్టా? మన మీలా చేయబోతున్నా మని ఊళ్ళో పోరు లావైంది. కనక నామాటవినీ వాళ్ళనే ఏ రాజమండ్రికో ఏ ఖరక్పూరికో వెళ్లిపోయి కార్యం ముగించుకు రమ్మను. ఆనెకచూతాం".

"ఆనెక చూచే దేమిటి? నలుగు రే మనుకుంటారు?"

"ఏ మనుకుంటారు? ఏ మనుకుంటే మన కేం?

ఎవడెవడి ఇబ్బందులూ, ఎవడెవడి సమయాసమయాలూ ఎవడెవడి సాధకబాధకాలూ ఒకళ్ళకెల్లా తెలుస్తాయా? అనుకునేవాళ్ళందరూ ఆచరిస్తూన్నారా?— ఒప్పుకుంటావా?

“చెప్పినట్లాగా చెయ్యకపోవటం నగుబాట్లపేరం అవుతుందంటున్నాను,”

“అర్థమయ్యింది. నట్టేటిదమ్మకిందే కట్టేస్తున్నావు. చేసేదంతా చెబుతున్నామా? చెప్పేదంతా చేస్తున్నామా? చెప్పకనే చేసేవారున్నారు. చేయకనే చెప్పేవారూ ఉన్నారు. చేసిందాన్ని చెప్పటమూ, చెప్పిందాన్ని చేయటమూ లోకాచారానికి విరుద్ధంగా ఉంటుంది— ఒప్పుకుంటావా? కనక ...”

“మీతో వాదించగల్నా? ఎవళ్ళేమనుకున్నా సరే. అన్న మాట చెల్లించాలి. ఇక్కడే జరగాలి. మా స్త్రీసమాజం వాళ్ళలో చాలామంది లావు ఉత్సాహంతో ఉన్నారు. మొన్ననే మీరు చేతులో చెయ్యివేశారు; నామీద ఒట్టు పెట్టుకున్నారు. ఆ మాటన్నా నిలుపుకుంటారా?”

అనగానే, రామరావు తలగోక్కొనుచు—

“సరే ఆలోచించు. నీకున్నంత అభిమానమూ, నీకున్నంత ప్రేమా నాకూ ఉన్నది. లోకరీతి చెప్పాను. మరో హామోస్తరుగా అనుకోకు. నీ యిష్టానికి వ్యతిరేకంగా నడవను గదా?” అన్నాడు. నాయిక ముఖము వికసించింది. ఉగాది

ఎవడెవడి ఇబ్బందులూ, ఎవడెవడి సమస్యాసమయాలూ ఎవడెవడి సాధకబాధకాలూ ఒకళ్ళు కెల్లా తెలుస్తాయా? అనుకునేవాళ్ళందఱూ ఆచరిస్తూన్నారా?— ఒప్పుకుంటావా?

"చెప్పినలాగా చెయ్యకపోవటం నగుబాట్లుచేరం అవుతుం దంటున్నాను,"

"అర్థమయ్యింది. నట్టేదద్దమ్మకిందే కట్టేస్తున్నావు. చేసే దంతా చెబుతున్నామా? చెప్పేదంతా చేస్తున్నామా? చెప్పకనే చేసేవా రున్నారు. చేయకనే చెప్పేవారూ ఉన్నారు. చేసిందాన్ని చెప్పటమూ, చెప్పిందాన్ని చేయటమూ లోకాచారానికి విరుద్ధంగా ఉంటుంది— ఒప్పుకుంటావా? కనక ..."

"మీతో వాదించగిల్నా? ఎవళ్ళే మనుకున్నా సరే. అన్న మాట చెల్లించాలి. ఇక్కడే జరగాలి. మాస్త్రీసమాజం వాళ్ళలో చాలామంది లావు ఉత్సాహంతో ఉన్నారు. మొన్ననే మీను చేతులో చెయ్యివేశారు; నామీద ఒట్టెట్టుకున్నారు. ఆ మాటన్నా నిలుపుకుంటారా?"

అనగానే, రామరావు తలనోకికొనుచు—

"సరే ఆలోచించు. నీ కున్నంత అభిమానమూ, నీకున్నంత ప్రేమా నాకూ ఉన్నది. లోకరీతి చెప్పాను. మరో హామోస్తరుగా అనుకోకు. నీ యిష్టానికి వ్యతిరేకంగా నడవను గదా?" అన్నాడు. నాగనాయిక ముఖము వికసించినది. ఉగాది

ఎవడెవడి ఇబ్బందులూ, ఎవడెవడి సమయాసమయా లూ ఎవడెవడి సాధకబాధకాలూ ఒకళ్ళు కెల్లా తెలుస్తాయా? అనుకునేవాళ్ళందఱూ ఆచరిస్తూన్నారా?— ఒప్పుకుంటావా?

"చెప్పినలాగా చెయ్యకపోవటం నగుబాట్లకేరం అవు తుం దంటున్నాను,"

"అర్థమయ్యింది. నట్టేటదిగమ్మన్నకిందే కష్టిస్తున్నావు. చేసే దంతా చెబుతున్నామా? చెప్పేదంతా చేస్తున్నామా? చెప్ప కనే చేసేవారున్నారు. చేయకనే చెప్పేవారూ ఉన్నారు. చేసిందాన్ని చెప్పటమూ, చెప్పిందాన్ని చేయటమూ లోకా చారానికి విరుద్ధంగా ఉంటుంది—— ఒప్పుకుంటావా? కనక ..."

"మీతో వాదించగల్నా? ఎవళ్ళే మనుకున్నా సరే. అన్న మాట చెల్లించాలి. ఇక్కడే జరగాలి. మా స్త్రీసమా జంవాళ్ళలో చాలామంది లావు ఉత్సాహంతో ఉన్నారు. మొన్ననే మీరు చేతులో చెయ్యివేశారు; నామీద ఒట్టె ట్టుకున్నారు. ఆ మాటన్నా నిలుపుకుంటారా?"

అనగానే, రామరావు తలగోకికొనుచు—

"సరే ఆలోచించు. నీ కున్నంత అభిమానమూ, నీ కున్నంత ప్రేమా నాకూ ఉన్నది. లోకరీతి చెప్పాను. మరొ హామోస్తరుగా అనుకోకు. నీ యిష్టానికి వ్యతిరేకంగా నడవను గదా?" అన్నాడు. నాగనాయిక ముఖము వికసించినది. ఉగా

ఎవడెవడి ఇబ్బందులూ, ఎవడెవడి సమయాసమయాలూ ఎవడెవడి సాధకబాధకాలూగా ఒకళ్ళకెల్లా తెలుస్తాయీ? అనుకునేవాళ్ళందఱూ ఆచరిస్తూన్నారా?— ఒప్పుకుంటారా?

"చెప్పినలాగా చెయ్యకపోవటం నగుబాట్లబేరం అవుతుం దంటున్నాను,"

"అర్థమయ్యింది. నట్టేదద్దమ్మకిందే కట్టేస్తున్నావు. చేసేదంతా చెబుతున్నామా? చెప్పేదంతా చేస్తున్నామా? చెప్పకనే చేసేవారున్నారు. చేయకనే చెప్పేవారూ ఉన్నారు. చేసిందాన్ని చెప్పటమూ, చెప్పిందాన్ని చేయటమూ లోకాచారానికి విరుద్ధంగా ఉంటుంది— ఒప్పుకుంటారా? కనక ..."

"మీతో వాదించగల్నా? ఎవళ్ళే మనుకున్నా సరే. అన్న మాట చెల్లించాలి. ఇక్కడే జరగాలి. మాస్త్రీసమాజంవాళ్ళలో చాలామంది లావు ఉత్సాహంతో ఉన్నారు. మొన్ననే మీరు చేతులో చెయ్యివేశారు; నామీద ఒట్టెట్టుకున్నారు. ఆ మాటన్నా నిలుపుకుంటారా?"

అనగానే, రామరావు తలఁగోకికొనుచు—

"సరే ఆలోచించు. నీ కున్నంత అభిమానమూ, నీకున్నంత ప్రేమా నాకూ ఉన్నది. లోకరీతి చెప్పాను. మరో మాపెమోస్తరుగా అనుకోకు. నీ యిష్టానికి వ్యతిరేకంగా నడవను గదా?" అన్నాడు. అంగనాయిక ముఖము వికసించినది. ఉగాది

ట్రంకు మోయించుకొని కుడిచేత సైకిలు నడిపించుకొనుచు ఎడమచేత సిగరెట్టుగాల్చుచు, బాడీలోనివారిని, దిగినవారిని దిగుచున్నవారినిఁ బరికించుచు సూర్యనారాయణ వేగముగ ప్లాట్‌ఫారము పొడవున నడచుచున్నాఁడు. తొందరగా రెండు బాఁజులు ముందునకేఁగిన సూర్యనారాయణనుజూచి రామ చంద్రరావు చే యప్పళించుచు.—

"సూర్యనారాయణా" అన్నాఁడు.

సూర్యనారాయణ మరలిచూచి నవ్వుచు సమీపించి నాఁడు; సైకిల్ సాడల్ మీఁద ఎడమ మోచే యుంచి—

"మొన్నగదా నా ఉత్తరం నీ కందుతా?"

"మొన్ననా?..." ఆలోచించి—"ఆఁ—మొన్ననే."

"మఱి జాబు వ్రాసుండే నిన్నను వచ్చేదిగదా-ఘట్రి గ్రా మియ్యాట పొందుకురా నిన్నను. జమీందాక్ ఎత్తు కుంతాను".

రామచంద్రుఁడు మందహాసముతో—

"మీరులేని జమీందాక్ మా కేమిటి ఉన్నదిరా?—

ను వ్రాసిగరెట్టు పారేసి మాటాడుదూ?— మొన్నను సినిమా వ్రాయటానికి తోచిందేకాదు. మఱేమిటో పిచ్చనాని నాలకమైంది. ఆవేళటి నా గందరగోళమూ, నా హంగామా నాకే ఆశ్చర్యమేసింది! నీ కేమేనా ఉత్తరం మొచ్చిందా?"

నొకపెట్టియం దుంచుకొనియుండినజాబు బయట బడినది. దానిమతలబు ఇది:

“నేను బ్రాహ్మణస్త్రీని. 8 నెలలకిందట ఘూముతాకి నాపెనిమిటి చనిపోయినాఁడు. అప్పటికి నాకు నెలదాఁటినది. మరొకపతిచే కడుపుచేసుకున్నా నని బంధువులు నాతో నాపుట్టింటివారిని వెలివేసినారు. ఈదుర్వార్తను సహించలేక మా నాన్న మూలికలచే కడుపుపోగొట్టడానికి యత్నించినారు. కాని వారిప్రయత్నం సాగలేదు. ఈశ్రీశైలంలో ప్రసవించినాను. బిడ్డను విడువలేక నే నెంతబతిమాలుకొన్నా మా అన్నలు వినక శిశువును బలవంతంగా తీసుకపోయినారు. ఆదుఃఖమూ ఈజనినిందా భరించలేక ఈగంగకు నాశరీర మొప్పగించినాను. పాపమూ పుణ్యమూ భగవంతుడే కనిపెడతాడు—”

“మార్కాపురంనుండి ప్రయాణంచేయుచుండిన ఇద్దరు పురుషులును ముసలమ్మయొకతెయు నంద్యాలపోలీసుఇన్స్పెక్టరుచే నరెస్టుకాఁబడిరి. వీరుపైజాబువ్రాసినస్త్రీకి అన్నగార్లును తల్లియు నని తెలియవచ్చినది. ఇన్స్పెక్టరు నరసింగరావు అను నతఁడు, మార్కాపురం స్టేషన్‌సత్రములో, సాధువేషముతో ఆతల్లి—కొడుకులను ఆనోక్కిబట్టినాఁడు—” అని ఇంక నే మేమియో చదువుచుండెను. రామచంద్రుఁడు “లైట్ ఆఫ్ యేషియా” అను నాంగ్ల గ్రంథము దీసి చదివికొనుచుండెను. మెయిలు ఆగవేగముల నడచుచున్నది.

# ౧౧. ప్రకరణము.

ఎనిమిదిగంటలు కావచ్చినది. సందెవెన్నెల మకమకలాడుచున్నది. రామచంద్రుడు వేగముగా ఇల్లుచేరి మేడమీదికి వెళ్ళినాడు. గోడదీపము కడకేగి చేతనున్న కాగితమువిచ్చి చూచుకొని బల్లమీద వేసినాడు. చూపు ఊర్ధ్వగతి నొందినది; నిట్టూర్పువుచ్చినాడు. రెండుచేతులం దల నొక్కుకొన్నాడు. అధోభాగమునకుం జూపు దించి నిలబడినాడు. వెలుపలివసారాబయలులోనికి వెళ్ళి నడుమునకుం జేతులు మా ఒడ్డి పచారుచేసినాడు. మధ్యమధ్య స్తంభించి పోవుచున్నాడు. ఆకసమునం జూపు నిలిపినాడు. గదిలోనికి వెళ్ళి అరవిచ్చిన నొక్కాయితో చక్కి నిలువంబడి గోడమీద చూపు గుఱిపెట్టినాడు. తల విదిర్చినాడు. ఒడలు కంపించినవి. బల్లమీదికాగిత మందుకొని నిబ్బరముగం జదివికొన్నాడు. కోపదృష్టులం బఱపినాడు. అశ్రుకణములు రాల్చినాడు.

"అన్నయ్యా, భోజనానికి రావూ?"— అని క్రిందినుండి రంగనాయిక పిలిచినది. రామచంద్రుడు స్వప్నావస్థనుండి మేల్కొన్నాడు. ధ్వని ఎవ్వరి దని ఆలోచించి-ఊహించినాడు. పిలుపా అని తర్కించినాడు. పిలుపునందలి అక్షరములను మనసు అందికొనలేదు.

"ఆఁ"—అని మాత్రము కలవరింతవలె నన్నాఁడు. [illegible] నిమిషములైనవి.

"భోజనానికి రావట్రా? అంటే—'ఆఁ'—అని ఊరకున్నావేమిటోయ్?"—అనుచు రంగనాయికి మేడమీఁదికి వచ్చినది. అది పచ్చని [illegible]తో [illegible] గాంతియుతో సరాగము [illegible] మన్నరామచంద్రునిఁ జూచి.—

"కవిత్వపిచ్చిపడితే ఇహా నేమీ తోఁచదు. ఏ పాలో పక్షా ఏదేలోకాన నీకు; తిండికి పదన్నా రాఁగూడదా?"—అన్నది. జవాబులేదు. రామచంద్రుఁడు కోటుపూర్తిగా విప్పి పక్క మీఁదికి విసరుచు—"నాకాఁకలి వేయుటలేదు"—అని పెడమొగము పెట్టి వెక్కసముగఁ బలికినాఁడు.

"ఏమిటీ ఏదో సూత్రముగా ఉన్నావు?" అన్నది రంగనాయికి.

"ఏమిటీలేదు"—అని ఉదాసీనతతో ఉత్తరము.

"అఘోరించావు లే. దిగఁమాత్రం రెండు మెతుకులు తిని వస్తూగాని."

"బలవంత మేమిటమ్మా అవసరంలే దంటూ ఉంటేను."

"అల్లాగాదు—రావాలి. ఈపూట కృష్ణపాకం రుచి చూతూగాని రా...ఎంతబాగా చేస్తుందిరా?—ఎప్పుడు నేర్చుకున్నదో కాస్తీ!"

"అఖ్ఖర్లే దంటే! చెబితే విను."

"ఏమిటో ఆందోళన పడుతున్నావు"— అని దగ్గఱకు వచ్చి కూర్చుండి బ్రతిమాలినది.

"ఏమిటో ఆయాసంగా ఉందే"- అని రామచంద్రుఁడు మంచముమీఁద పరుండి పై చాందినీ వైపు చూచుచున్నాఁడు.

"ఏమి టాయాసం?"—అన్నది రంగనాయిక.

పలుకఁడు- చలింపఁడు. రంగనాయిక ఒట్టుపెట్టుకొన్నది. రామచంద్రుఁడు లేచి కూర్చుండి ఊర్చి దోసిటిలో ముఖము ముంచుకున్నాఁడు.

"అన్నయ్యా, నాకు ఎన్నఁడూ దాపరికం పెట్టేవాఁడవు గావుగదా! ఏమిటో నీవు పడేబాధ చెప్ప వేమిటి! అమ్మ ఏమన్నా అంటుందనా?"— అని పలువిధముల గడ్డము పట్టి చనువుమై నడుగుకొన్నది రంగనాయిక.

"పలక వేమిట్రా! మనసులో పెట్టుకొని కుళ్ళట బాగాలేదు. నాకు చెప్పటానికేఁ!"

ఉత్తరీయపుకొంగు నవరించుకొనుచు ఖేదముతో— "ఏమిటి చెప్పమంటావ్! దాన్ని వాళ్ళ అన్నయ్యావద్దికి పంపి వేస్. నా కిష్టం లేదు."—

అనిన రామచంద్రునిమాట రంగనాయికకు చలి పిడుగు పాటైనది- మతిపోయినది. చిత్రితప్రతిమ యైనది. కొంతవడికిఁ తెప్పిఱిలి——

"ఏమిటో సంగ తన్నా చెప్పు. అల్లాగే పంపివేతా మ్లే-" అన్నది.

రామచంద్రుఁడు షర్టుజేబులోనుండి కాకితము తీసి ఇచ్చినాఁడు. రంగనాయిక తడవుసేయక దీపముకడఁ జేరి చూచుకొని—

"ఇది స్పష్టంగా కిట్టని దొంగముండ కొడుకులు చేసిన కుట్ర- సందేహంలేదు. ఇవి దాని చేవ్రాలే కావు; పోనీ ఎవరితోనన్నా వ్రాయించి దస్కతు వ్రాసినా లేక మన యింటికీనూ-? ఈ మాత్రానికే నట్రా! అని అన్నానని ప్రాణం! ఒకే నా కొక్కమాటకి సమాధానం చెప్పా- అల్లాగే ప్పి ఉంటే ఆ మహారణ్యాల్లోబడి పోతున్నప్పుడే ఇక్కడికి రానిచ్చునా మొగుడు? చిన్నప్పటినుంచి దాని స్వభావం ఎరుగుదును గదా! తొందరపడ్డావు. శాంతం తెచ్చుకో! నిమ్మళంగా ఆలోచించుకో! వట్టినె ఖంగారు మనిషివి! దాన్నననుకున్నా వాళ్ళు తుడిచిపెట్టుకు పోతారు; చూస్తూ నామాటన్నాను! అల్లా ఏ మాత్రం సందేహంగాఉన్నా నామట్టుకి నే నొప్పు కుంటానా? మధ్యపెట్టి ద్రోహాని కొడికడతా ననుకున్నావా? మనస్సు కుదుట ఉంచుకొని ఆలోచించు! ఈ జాబు నీకిచ్చిన వాఁడెవడా?!"— అనుచుండగనే రామచంద్రుఁడు లేచి తువాలు వేసికొని రంగనాయిక చేతికాకితము లాగికొని మెట్ల గుమ్మము వద్దికి బిస బిస నడచినాఁడు. సోపానమార్గమధ్య.

"కృష్ణమూర్తిగారూ, చూడండి, మీరు, నాటకాల్లో తిరిగే సజ్జులాంటి వారుగా దనిన్నీ, గౌరవంకోసం పాకులాడే వా రనిన్నీ విని వచ్చాను. మిమ్మల్ని ఒక్క ముక్క అడుగుతాను. ఉన్న దున్నట్టు చెప్పేశెయ్యండి. మీకు వచ్చిన భయంగానీ, నామూషీగాని మరేముండదు."

"దానికేం బాబూ సెలవియ్యండి. నాస్వభావం తనకు బాగా..."

"ఆకళింపు ఉండబట్టే నిజం తెలుస్తుం దని వచ్చాను. చూడండీ!— నాటకమైన మఱుదినం మీ కెవరైనా స్త్రీ ఏదైనా ఉత్తరం గిత్తరం పంపిందా? దాన్ని మీ కెవరికేనా మీ స్నేహితుల్లోవాళ్ళకి ఇచ్చారా? అలా వచ్చి ఉంటే ఆవిడ పేరు చెప్పటానికి మీ కాక్షేపణలేకుంటె చెప్పొచ్చు. దాన్ని గుఱించి మే మంతగా తఱచదలంచుకో లేక కూడాను."

"ఉత్తర మేమిటీ! స్త్రీ వ్రాయట మేమిటి! సోమవారం మధ్యాహ్నం వెళ్ళాను నకిసీపట్నం. ఆ వేళ్ళన పొలాలు గిఱ్ఱా చూచుకొని [1]ఉష్ణంతో చేరాను ఈ వేళ సాయంకాలానికి— కొంప. మీ రడుగుతూవుంటె నిర్ఘాంతపోయ్యా నన్నమాట. ఈశ్వరసాక్షిగా నే నేమి ఎఱగను బాబయ్యా."

1. = జ్వరము.

"సరే అడుతా ఎఱుగుదుంగా! మఱి ప్రస్తుతవిష
యాన్ని గురించి యేమంటారు?"

"ఏమన మంటారు?— మీరు కోరిన ప్రమాణం చేస్తాను."

"చూడండీ— సూరి సత్యనారాయణ శాస్త్రిట! ఆ జోస్యం గారు చెబుతూంటాడట!— అతన్తో మీ కేమిటి పరిచయం?

"ఆఁ—ఇప్పు డర్థమైంది. జోస్యం లేదూ వాడి శ్రాద్ధమూ లేదు— వాణ్ణెరుగుదు—నాకు వాడితో పరిచయం గిరిచయం ఏమీ లేదు— అభూతకల్పనకి అంతవాఁడు లేఁడు— నట్టి డాఘరు ముండకొడుకు— డబ్బిఖోరు— దగాఖోరు. అస్తమానం ప్లీడర్ల ఇళ్ళచుట్టూ తిరగటం వాడిపని. చెయ్యండి వాకబు వాడిపురాణం తమకే బోధౌతుంది."

"చూడండీ!— ఉమామహేశ్వరంగారంట!— ఆయనకీ ఈయనకీ ఏమిటి స్నేహం?"

"అసలు ఉమామహేశ్వరంగార్నెఱుగుదురా! పింఛను పుచ్చుకొన్నారు. ఎక్కడో దివాను గిరీ చేశారటకూడాను! డబ్బైయేళ్లుకావచ్చాయి— ఇంకా ఆయనగారికి తిరుగుమోతానం మానలేదు— ఇంకా మీసాలకీ, బుర్రకీ, కనుబొమ్మలకీ కూడా రంగుపులుముకుంటాడు. ఈమధ్యనే పళ్లుకూడా కట్టించుకొన్నాఁడు. డబ్బాటి గోరంపస సరేసరి. చీవాట్లూ

చీపురుదెబ్బలూ ఆయనగారికి నిత్యవిధి. అలాంటివారికి తారుస్తూ తలలు మారుస్తుంటాడు ఈ సత్యనారాయణ శాస్త్రి—విచారించండి."

"సరే ఉండిపోండి. ఉష్ణంగానుంటావు" దన్నారా- చాలాశ్రమపెట్టాను.–క్షమించండి."

"ఫర్వాలేకుండా. మీరు ముఖాముఖీ సత్యం కను క్కోవటానికి వచ్చారు. సజోరీగా వ్యవహారం తేలిపోయింది. నాకు చాలాసంతోషంగా ఉంది."

అని అటనుండి తరలినారు. కొంతదూరమువచ్చి కృష్ణ మూర్తి తన ఇంటికివెళ్ళినాడు. సోమసుందరము రామచం ద్రునితో నడచుచు——

"విన్నావటోయ్ అసలునిజ మేమిటో తేలిందిగా? సరిలేదు. మనప్రయత్నం చెడగొట్టేనేకాని ఆ ఉమామహే శ్వరంగారి కూతుర్ని నీకు కుదర్చటానికి పిస్తేను. అందుచేత వేశా రీకన్నాగం—తెలిసిందా?

నువ్వకాస్త లౌక్యం నేర్చుకోవాలి. ఇహాను జరిగిన విషయాలన్నంతా ఒకమాటు [1]నైఘంటువేసి చూచుకో. వెఖ్ఖ మహామహోస్తరు తలపెట్టకు.—" అన్నాడు.

"తెలిసిందిగా! ఉదయం కనబడతాను—" అని రామ రామచంద్రుడు వీడ్కోన్నాడు.

---

1. వరియా (comparison)

# ప్రకరణము - ౧౧.

అరుణోదయమైనది. పొద్దు వసారాలో కుంపటిమీద కాఫీకి నీళ్ళు పెట్టి విసరుచు—

భక్తితో తులసికీ గోవిందా రామ-

పూజ నే చేతునూ గోవిందా రామ.

కృష్ణతులిసెమ్మకూ గోవిందా రామ

మ్రొక్కులం బెత్తునూ గోవిందా రామ—"

అని పాటలక్క అవధానుల రామమ్మ పాడుచున్నది. బాదముచెట్టుకింద పనికత్తె పాత్రలు తోముచున్నది.

నిత్యోదకములనూ గోవిందారామ-

ఏమిటేవ్ మే మేమిటి బ్రాహ్మల మనుకున్నావా శూద్రాళ్ళ మనుకున్నావా?— యీవన్నా గాని— అయ్యో దేముడా! ఎన్నిసార్లు చెప్పనే?—ఆ బోకుల్లో అంట్లు ఆపాళంగానే శద్ధటాన్ యీవన్నా గాని రోజూ ఆ అంట్లన్ని కడుక్కొని పూటపూటా స్నానాలు చేస్తుంటాను. చెప్పినా విలవకపోతే ఏలాగ?—

'నిత్యోదకములనూ గోవిందా రామ—

అబ్బే అదేమిటేవ్—నీ చుట్టముక్క తగలెయ్యా—అంతా మాలకూడే అయింది యీవన్నా గాని— ఎంగిలిచుట్టముక్క—

ముట్టుకున్న చేత్తోనే ఆకడిగిపెట్టిన పాత్రగ్గ ముట్టుకుంటున్నా వు కొ-యీవన్నాగాని- అమ్మో ఆచారం మగ్గిపడిపోతున్నాది-

"నిత్యోదకములని గోవిందా రామ-

బయట వేణ్ణీళ్లెట్లాపుతవే? పెద్ది సూరమ్మగా ఆపనిజూడు! ఇప్పుడు తుడిచావుగావుగదా! పాచికొంపంతా ఆపాళంగా ఒగ్గేసి-యీవన్నాగాని- అంట్లకొచ్చిందిటే నీకు తొందర?-"

"అమ్మగో ఇంకా తొంగుంటే ఎలా తుడ మంటారు?"

"భాగీరథీగ గోవిందా రామ-

చూడవా, అమ్మో, అవు దగ్గర పేడాకసువు దీసి ఆ చూపని ఇసుంట దూరంగా కట్టుంట్యా- నిక్కుడు తీగలుసేస్తున్నాది....-"

అని, తులసెమ్మపాటతో దాసిదానికి చివాట్లు ఆరంభించి విసరుమన్నది-వంటలక్క.

రంగనాయకి ఎందుకో మేడమీదికి వెళ్లినది.

"ఎక్కడ దాగిపోయిందో!"- అని అస్పష్టముగా సనుచున్నాడు రామచంద్రుడు.

రంగనాయిక మంచము దరిసి-

"అనయ్యా, కలవరిస్తున్నావటా ?- ఏ !- ప్రొద్దు పొడుస్తున్నది."

"..........."

"లేరా" అని తట్టి లేపినది.

రామచంద్రుఁడు కనులు తెఱచినాఁడు.

"కలవరించావా ?"

కలవరించానటే?- ఏ మని?- కలలో ఉండగానే లేపే శేశావ్."- అన్నాఁడు రామచంద్రుఁడు.

"కవీశ్వర్లకి కలల కేం తక్కువ?- మేలుకున్నా కలలే నిద్దర్లోనూ కలలే. నాకేమిటో ఒక్క కలా జ్ఞాపకముండదు. కొందఱే కలలు కథల్లాచెబుతుంటారు."

"కథలే కల లౌతుంటాయి; కలలే కథ లౌతుంటాయి."

"పోనీలేద్దూ మాట మాట్లాడితే కవిత్వమేనా ?— ఏమిటా కల ?"

"మొన్నను తెచ్చాను గోల్డుచెయిన్ రిస్టువాచీ !— అది ఎక్కడికో వెళ్ళి వస్తుంటే జాఱిపడ్డట్టూ దాన్ని వెదకుతూ ఉన్నట్టూ"—

"దొరికిందా ఇంతకూను ?"

"వెదకడంలో ఉండగానే లేవగొట్టావుగా!"

"ఔను గానీ- కలలు కొన్ని జరుగుత వంటారు- నిజమే నంటావా? అమ్మకి కలలు జరుగుత వనే నమ్మకమ్."

"ఆరోగ్యవంతుడికీ శాంతుఁడికీ కలలురానే రా వనీ ఎప్పు డన్నా అదాటుగా వస్తే దానిఫలితం కనబడుతుం దనీ,

అంటారు. పరున్నదిమొదలు నిద్రంతా కలలతోనే గడిపే వాళ్ళకి ఎన్నికలలొస్తేనేం?"

"లే ఇంకా పరున్నావేం?- రాత్రి సోమసుందరం ఏమా మన్నాడు? నే నన్నంత నిజమైందా?"

"ఈ వాళ ఆ సత్యనారాయణశాస్త్రి రానీ చెబుతాను."

"ఇల్లా ఎన్నికొంపల్లీశావో పిడికుంపడెగా!"

"ఎంతో పెద్దమనిషిలా కనబడ్తాడే పిడి బొడ్డువాళ్కా—!

"ఏవంగ తొత్తుకొంపను లందరూ ఆలాగా కనబడుతుంటారు.- లే వెళదాం క్రిందికి."

ఇరువురు క్రిందికి దిగవచ్చినారు. కల్యములైనవి.

"భాగీరథీగంగ గోవిందా రామ—

అని పాడుచుండిన వంటలక్క రామచంద్రుని గాంచి పాట ఆపి సిగ్గు నటించి—

"పూర్వకాలప్పాట లనికామోసు అబ్బాయిగారు నవ్వుతున్నారు.- ఏమండోయ్ రంగనాయకమ్మగారూ, రోజూ ఇడ్డెన్లేనా అని కోప్పడతా రని ఈవాళ వెసరట్టు చేస్తున్నాను..."అన్నది.

"మంచిపంజేశారు. అన్నయకి చెన్నాపట్నంలో పెసరట్టు దొరకదు. మొగంవాచి వచ్చుంటాడు.—" అన్నది

రంగనాయికి రామచంద్రుని మొగము చిన్నవ్వుచు. నిక్క-
లం బరికించుచు గాజు పెసరల్లతో, రంగనాయికి చల్లార్చి
ఇచ్చిన కాఫీ పుచ్చుకొని లేచి తలవంచుకొని క్రీరచూపులతో
ముగ్గురులం దడవికొనుచున్నట్లుగా మేడమీఁదికి వెళ్ళి
నాఁడు రామచంద్రుఁడు.

"ఇదేమిటమ్మా ఈవిడ నిద్రలేవలేదా! — ఇంతసేపు
పరుండేదికాదే!" — అనుచు రంగనాయికి లేచి గదిలోనికిఁ
బోయి మడతమంచము మీఁద ఎల్లబుగ్గి సుకప్పుకొని పరున్న
కృష్ణను చెలచినది. మనిషికాదు — చూడఁగా తలగడ నిలుపున్న
దది. వేళాకోళానికి ఎక్కడనో దాఁగి ఇట్లు ఉడికించుచున్న
దని రోషముతో ఇంటిలో నాలుగు మూలల వెదకినది — కాన
బడదు. బీర్వామాటున? — లేదు. ఉగ్రాణపుగదిలో? — ఊ
హూఁ. దక్షిణపువైపు వసారాదొడ్డిలోని సందుపాది చాటున? —
అగపడదు. ఎక్కడికిఁ బోయినదని ఆలోచన. ఎన్నఁడు
బయటిగుమ్మము మొగము చూడదే యని సమాధానము.
క్రొత్తయూరు - పరిచితులు లేరు - మ ఇక్కడి కేఁగునని ప్రశ్న.
ఉత్తరము తోఁపదు. పూర్వాపరసందర్భములు ముఖాబిలాకు
వచ్చినవి. రాత్రి తాను, రామచంద్రుఁడును మాటలాడు
నపుడు వినియుండునా యని సంశయము - ఊహ నేమో యని
శంక. రాత్రి మేడదిగివచ్చినది మొదలు తనతో యథా
పూర్వముగ అరమఱికలు లేక మాటాడెనా యని సందేహము -

జ్ఞప్తి లేదు. లోనియురియాటరేగి ఓప్పును తూలఁగొట్టుచున్నది. వంటలక్క నడిగినది. ఉదయమునుండి చూడలేదని ఆమె జవాబు. వెదకవలయుస్థలములు?— ఏవియో ఊహ కందవు. మఱి దానిసామాను?— ఐరన్ సేఫ్ ప్రక్కన పెట్టినది పెట్టినట్లున్నది ట్రంకు. తాళముచెవి దానికే యున్నది. పెట్టెపైఁ బుస్తక మొకటియున్నది-అది యామె చదువుచుండిన శాకుంతల నాటకము. నిన్న ఆమె కట్టినది సిల్కుచీరయేగదా?- ఔను అది ఆ మంచము మీఁదనే యున్నది. జాకెట్టు?— అదియు దానిప్రక్కనే వ్రేలుచున్నది. పెట్టెలోని వస్తువులు?—అన్నియు మట్టసముగనే యున్నవి. ఒక్కొక్కటిగాఁ దీసినది. ఆమెనగ లనున్న పెట్టెగొలుసు కనఁబడినది. ముద్దులు, చేతిగాజులు, గడియారపుగొలుసు— డబ్బిలో నున్నవి. బయటనుండిన ఆమె చీరలు రవికెలు?— అన్నియు నెక్కడి వక్కడ నున్నవి. రంగనాయకిగుండె లవిసినవి. దుఃఖావేశము ఉట్టుంతలూంచినది. ముందువెనుకలు తోఁచవు. కంఠమునుండి ధ్వని వెలువడదు. నట్టేటి ముసక్కలైనది. కాళ్లాడవు. కంపించుచున్నది కాయము. ఈకళవళపాటున శరీరము నెట్లో మేడమీఁదికిఁ జేర్చినది. అచట రామచంద్రుఁడు ఎడమవ్రేళ్ళతో మీసములను స్పృశించుచు పద్యములఁ దిద్దికొనుచున్నాఁడు.

“రాముఁడూ,”— అని కన్నీరువదలినది రంగనాయకి.

"ఏమిటే అమ్మాయ్!"—అని సమీపించినాఁడు రామచంద్రుఁడు. తడఁబాటుపడిన యెలుఁగుతో: "కృష్ణ కనఁబడదురా!" అను స్వరములను బలవంతముగ బయటఁ వేసినది రంగనాయిక. రామచంద్రుఁడు వెఱ్ఱిచూపులఁజూచుచు నిలుచున్నాఁడు. ఆ నిర్విణ్ణతనుండి ఆ నిశ్శబ్దతనుండి యుద్భవించుచున్న భావవీచికల వినిపింపఁగల వక్తయేఁడీ? ఆ యన్నచెల్లెండ్ర అశ్రుసంప్లావితలోచనములు కురియుచున్నరసము నెత్తిచూపఁగల ఉపాసితయేఁడీ? ఆ వారిముఖదర్పణమునఁ బ్రతిఫలించుచున్న చిత్తవృత్తిఁ గనిపట్టఁగల ద్రష్టయేఁడీ?—ఈ నిశ్చల సమాధియందు, ఈమౌనయోగమున ఎన్నిగడియలు గడచెనో వా రెఱుఁగరు. రామచంద్రుఁడు కీలూడినబొమ్మ యైనాఁడు. ఉన్నట్టుండి రంగనాయిక క్రిందికిఁ బఱచినది. గదిఁ బ్రవేశించి పడి. ట్రంకుమీఁది శాకుంతలము విప్పినది. అందు కాకితపు మడుపొకటి చూపడినది. కుతూహలముతో నొక్కమాఱు పాఱజూచినది. ముందు హాలులోని కురవడించినది. తరువాతి మార్గము గన్పడదు. స్మృతి వికలమైనది. ఇంటనున్న వారి పేర్లే జ్ఞప్తిలో లేవు. బాష్పావరుద్ధమై గళస్వనము దూషితమైనది. ఎట్టెదుటనున్న వంటలక్కనుగాంచి సప్రయత్నముగ—

"వాణ్ణి"—అని ఆలోచించినది— "అన్నయ్యాని" అని క్షణ మాగినది— "రమ్మన మనండి"— అన్నది.

రామచంద్రుఁడు అతిసమీపముననున్న తులసికట్టమీఁద గొంతుకూర్చుండి నేలమీఁద గీతలు గీయుచున్నాడు. ఎవ్వ రేదియు మాటాడుకొనరు.

"మీ యిద్దఱూ ఏదేనా తగాదా పడ్డారా ఏమిటి? ఈ యుపహారా లేమిటి! దివాళాతీసినట్లున్నారు?" —అన్నాఁడు రామరావు.

రంగనాయిక కన్నీరు తుడుచుకొనుచు కాకితము చేతి కిచ్చినది. రామరావు మొదలు ఒకటి రెండు పంక్తులు తనలోఁ జదివికొని చివరిభాగము జూచి—తలయూఁచుకొనుచు—

"ఏమిటి కృష్ణవేణమ్మ స్వయంగా వ్రాసిందే! అక్షరాలు ముత్యాలకోవలా ఉన్నాయి! తెలుఁగు బాగా చదివింది లా ఉంది! సంస్కృతంకూడా వచ్చా! నే నెఱుఁగనుసుమీ!"—అను చుండఁగా రంగనాయిక గద్గదికముగాఁ బైటచెఱఁగుతో గను లద్దికొనుచు—

"చదవండి బిగ్గరగాను"—అన్నది.

రామరా విట్లు చదువఁ దొడఁగెను:

"రాత్రి మేడమీఁద జరిగిన సంభాషణము సమగ్రముగ వింటిని; ఉమ్మలించితిని; వెఱ్ఱినైతిని; నిందకుఁ గారణము-భూతమైనవ్యక్తిని నోనాడితిని— విధిని దూఱితిని. నిశీథము

అకట నా పడిన ఖేదము హృదయ మెఱుఁగును. క్రుమ్మరించిన కన్నీటిధారలు కను తెఱుఁగును. విశ్వాత్మవైన నన్ను నా మనస్తాపము మేడమీఁది కీడ్చికొనిపోయినది. శయ్యాగతుఁడై సుఖనిద్రనున్న నాదేవుని నిన్ను గాంచి కనులు భాగ్యవంతము లైనవి. ధ్యానించి మనసు కృతార్థమైనది. నమస్కరించి కర యుగ్మము సభాజనమైనది. సరించి జన్మము ధన్యమైనది. గోడ నున్న పటమునందలి నీ రూపమును ముచ్చట దీఱ ముద్దాడి తిని. అంతట తీవ్రమైన ఆవేదనము దిగి లాగినది. [illegible]వసా రాలోఁ జిక్కినది. దీపము తోఁచైనది. హృదయము చిందరవంద రలైనది. సమీవ్రాయుటకుఁ గోఁచునపడగా, ఈ విఘాతమునకుఁ గారణమేమి యని ప్రశ్న బొడమినది. 'ప్రాప్తవ్య'మని అంత రాత్మ బోధించినది. నిమిషమునకుఁ బూర్వము నాపడిన పరి తాప మంతయుఁ బామరత్వ మని తోఁచినది. మనసునకుఁ స్వాస్థ్యము కుదిరినది. ధైర్యము తలసూపినది. దారి కనఁబడినది.

ఇఁక నా హృదయమును నివేదింతును: వలపునకు వ్యాజము తెలియదు; హేతువు కనఁబడదు; కారణము లేదు; కేవలము నైసర్గికము— 'భావస్థిరాణి జననాంతర సౌహృదాని' అనుటచే కారణ మేర్పడుచున్నది. అకారణ మయిన దానికిఁ గారణముఁ గల్పింపనా? అనిర్వాచ్యము వాచ్య

మగుట ఎట్లు? కావున దానిని అనవద్య మందును. కారణ రహితమైనది ప్రకృతి— స్వభావము. కారణముగలనాఁడు కృత్రిమ మగును. దానితో హేతువు—వ్యాజము పొందు పడును. శుచిఱుసగిపునకుఁ గారణ మేదని చెప్పఁగలదా?

ఇట్లనుటచే 'అవ్యాజప్రేమ సిద్ధాంతమునకా ఇంత తర్కము వినియోగించినది'!— అనిలాఘవము చేయుదువేమో!

మన ప్రణయకిసలయము కారణము నాశ్రయించి కృత్రిమదోహదక్రియాభాజనమై ముదిరి కాయిగ్గిన్నై పండి ఎండి రాలి పోవకమునుపే ఇట్లు ఘటించుట సమ్మోదావహము. సుఖము: బంగారు సంకెల; దుఃఖము: ఇనుప బేడీ; రెండును ప్రకృతి నను భోగించుటకు నిర్బాధము లే - నిరోధకములే. స్తుతికి సంతసించిన మానసము నిందకు సంతసింపదా? మన ఎడబాటుననే ఈ మనప్రణయము నిత్యపల్లవిత మగు నని నమ్మెదను. పల్లవమునకు భావి దశలు గలవు; ఫలమున కదియే చరమదశ.—

ఇది చదివి 'వేదాంత మొలుకఁ బోసినదా!' అని పరిహాసింతువు కాఁబోలు!

నా యాత్మ నిను సర్వవిధముల ననుభవించినది. భౌతిక విఘటనమునకు నగ నేల ? ఈ నా యవతారమున కింతటితో సమాప్తి. భావిగతి నైవాస్తికము.—

'ఈ సాహస మింకయు బెదరింపా!' అని నాగటుగఁ దలంతువు కాంబోలు!

ఇక నొక్కమాట—

సాశయ మున్న చోట ప్రేమము నిలువదు. ప్రేమ మున్నచోట సాశయము చేరదు. దీనిని జ్ఞప్తియుందుంచుకొమ్ము. ప్రియమైన కన్య నువరింపుము; మన సిచ్చి మన్నింపుము. జీవయాత్ర సుగమముగ సాగింపుము. నన్నుఁ గూర్చి నేఁడు నీ వినిన కింపద తీయాదలి యాథార్థ్య మెన్నటికేని వెలికి రాకపోవదు. అపుడు, నను దలంచి విడుచు నీయశ్రుకణ మొక్కటి చాలును—అది నాకు నివాపోదకము.

మంగళవారమునాఁడు రైలునుంచి వచ్చి గుమ్మమున బండిదిగి మేడముంగిటనుండి నను జూచిన చూపులును, గురువారము సాయంకాలము సికారుపోవుచు మొగము మలఁచి మాచిన చూపులును నా కెన్నేని మనోహర వృత్తిముల చెప్పుచున్నవి. అవి నా యాత్మయందు భద్రముగ నున్నవి. నీ గీతికలు నీ గేయములు నాలో నైక్యమైనవి. నాకు గావలయునది లేదు- నీకు దెలియదగినది లేదు.

చరమ ప్రణామములఁ బరిగ్రహింపుము- సెలవు.

—కృష్ణవేణి."

... ... ...

అనుచు, రామరావు దుఃఖాశ్రువులతోఁ జదువలేక చదివినాఁడు. ప్రకృతి సర్వము ప్రళయగర్భమునఁ జొచ్చుచున్నట్లు దోఁచినది- స్తంభీభూతమైనది. ప్రభాతభానుఁడు ఈ స్థలకమును తొంగిచూచుచున్నాఁడు.

... ... ...

మధ్యాహ్నము మీఁరినది. రామచంద్రుఁడు అంతర్ధానమైనాఁడు. వెదకిరి—ఏఁడీ?........................

